మీ రేమనుకుంటారు?' నేను సమాధానము చెప్పేలోపల మరల ప్రశ్నించింది. 'నాన్నా, అమ్మకు - నీకు ఏమౌతుంది?'

నా కేమి చెప్పాలో తోచలా, నాలో నేను గొణుక్కుంటూ, 'మినీ! భోలాతో ఆడుకో, నాకు పనిఉంది!' అన్నాను.

నా గదిలో కిటికీగుండా చూస్తే రోడ్డు బాగా కనిపిస్తుంది. మిని నా బల్లవద్దనే ఆడుకుంటూ కూర్చుంది. నేను కొత్తగా తెచ్చిన నవలలో 17వ అధ్యాయము చదువుతున్నాను. మంచి రసవత్తరమైన ఘట్టంలో ఉన్నాను. కథానాయకుడైన ప్రతాపసింగు కాంచనలతను తీసుకొని తోటలోని మూడవఅంతస్తుగుండా పారిపోతున్నాడు నా నవలలో. ఇంతలోకే మిని తలుపువద్దకు వెళ్ళి, 'కాబూలీవాలా! కాబూలీవాలా!' అని కేకలు పెట్టింది. వీధిలో చూస్తే నిజంగా కాబూలీవాలా! పెద్ద తలపాగా, మాసిపోయినబట్టలు, వీపున పెద్దసంచి, చేతిలో ద్రాక్షపళ్లు పట్టుకొని వస్తున్నాడు.

వీడి ఆకారం చూచి, మా అమ్మాయి యేమనుకున్నదో నేనుమాత్రం చెప్పలేను. వాణ్ణి పెద్దగా పిలుస్తున్నది. వాడు తప్పకుండా వస్తాడు. నా నవలమాత్రం

పూర్తికాదు. అని అనుకుంటూ ఉండగానే వాడువచ్చి మా అమ్మాయివంక చూచాడు. వాడి అవతారాన్నిచూచి పిల్లకు భయం కలిగి, తల్లివద్దకు పరిగెత్తింది. వాడి దగ్గిర ఉన్న సంచిలో తనమాదిరి పిల్లలు యిద్దరు ముగ్గురు వుంటారని దానికి గట్టి నమ్మకం.

నే చదివే నవలలో నాయికానాయకులు క్లిష్టదశలో ఉన్నారు. నేను చదువు మానివేసి, వచ్చిన కాబూలీవాలా వద్ద కాయలు, పళ్ళుకొని - వానితో రష్యనులు, ఇంగ్లీషు వారు, అబ్దుల్ రహిమాన్ మొదలగు వారిని గురించి లోకాభిరామాయణం మాట్లాడాం. వాడు మళ్ళీ 'ఆ చిన్నమ్మాయి యేదండీ?' అని అడిగాడు. మా అమ్మాయికి భయంపోవాలనే ఉద్దేశ్యంతో మినిని వెంటనే అచ్చటకు తీసుకొచ్చాను. మిని కుర్చీవద్ద నిలబడి కాబూలీవాలా వంక, వాని సంచివంకా చూస్తూ నిలబడ్డది. అతను ఎండిన ద్రాక్షపండ్లు, కొన్ని బాదంకాయలు తీసికోమని యిచ్చాడు, మిని వాటిని తీసుకొనకుండా వాడిమీద అనుమానం ఎక్కువయి, నాదగ్గర బిగపట్టుకొని నిలబడ్డది.

కొన్నిరోజులు గడిచిన తర్వాత ఒకరోజు ఉదయం నేను ఇంటినుండి వెళ్ళుతుండగా మిని, కాబూలీవాలాతో నవ్వుతూ, మాట్లాడుతూ తలుపుదగ్గిరఉన్న బల్లమీద

కూర్చున్నది. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. దాని ముచ్చటలు ఓర్పుతో వింటూ కూర్చుండేది. నేనూ, కాబూలీవాలా తప్ప మరెవ్వరూ లేరు. కాబూలీవాలా యిచ్చిన పండ్లు, కాయలు తన బొడ్డున పెట్టుకున్నది. 'అవన్నీ ఎందుకిచ్చావు ?' అంటూ వానికి అర్ధరూపాయి యిచ్చాను. వాడు సంతోషంగా డబ్బు తీసుకొని జేబులో వేసుకున్నాడు.

ఒక గంటయిన తరువాత ఇంటి తిరిగివచ్చాను. నేను యిచ్చిన అర్ధరూపాయిమీద యింకో రాద్ధాంతము జరుగుతున్నది. నేను యిచ్చిన అర్ధరూపాయి కాబూలీ వాలా మినికిచ్చాడు. మినిని 'అర్ధరూపాయి ఎక్కడనుంచి తెచ్చావు ?' అని తల్లి ప్రశ్నించింది. 'కాబూలీవాలా యిచ్చాడు నాకు' అని మిని సమాధానం చెబుతున్నది. 'కాబూలీవాలా యిచ్చాడా నీకు !' ఆశ్చర్యంతో అన్నది తల్లి. 'మినీ, నీవు వానివద్దనుండి ఎలా తీసుకొచ్చావు ?' నేను కలగజేసుకొని తగాదాను తీర్చాను.

మినికి కాబూలీవాలా అంటే భయం పోయింది. వాడు మినికి ద్రాక్షపళ్లు, బాదంకాయలు పెట్టి మెల్లిగా మచ్చిక చేసుకున్నాడు. వాళ్లిద్దరూ ఇప్పుడు పెద్ద స్నేహితులయ్యారు. వాళ్లిద్దరూ వింతలూ, వినోదాల్ని

గూర్చి మాట్లాడుకుంటారు. మిని వాడి ఆకారాన్ని చూచి పెద్దగా నవ్వుతూ 'ఓ కాబూలీవాలా! కాబూలీవాలా! నీ సంచిలో ఏముంది' అని అడిగేది.

'వొక పెద్ద ఏనుగ' అని సమాధానం చెప్పేవాడు. ఇలా సరదాగా కాలంగడిపాక 'మామగారింటి కెప్పుడెళ్ళు తావు అమ్మాయి?' అని అడిగేవాడు.

బెంగాలు అమ్మాయిలకు మామగారిల్లు అంటే తెలిసే ఉంటుంది. కాని మేము కొత్తగా ఉంటాన ఈ సంగతి మినికి మాత్రము చెప్పలేదు. కాని మిని వెంటనే 'నీవు వెళ్ళుతున్నావా?' అని అడిగేది.

కాబూలీవాలా జాతిలోమామగారిల్లంటే రెండు అర్థా లున్నవి. కఠినమైన భావాలను మృదువైన మాటలతో చెప్పేపద్ధతి, ఒకటి; మనకు దమ్మిడీఖర్చులేకుండా మానవు లను కాపాడెజైలు, రెండు: పోలీసువారిని చాటున పిడికి లితో కొట్టునట్లు చూపుట. ఈ మాటలు చెప్పుకుంటూ వా ళ్ళిద్దరు విరగబడి నవ్వేవాళ్ళు.

అవి ఆకులు రాలే రోజులు. పూర్వం ఈ రోజు ల్లోన్నే రాజులు యుద్ధాలకు వెళ్ళేవారు. నేను కలకత్తాలో నాగదిలో కూర్చొని ఈ విశాల ప్రపంచాన్నిగూర్చి ఆలో చించేవాణ్ణి. వీధులలో ఎవడైనా ఒక విదేశీయుడు కన్పి

చితే వాని దేశములో ఉన్న పర్వతములు, లోయలు, అడవులు, యిళ్ళు మొదలగు వాటినిగురించి కలలు గనేవాణ్ణి. వాటి నన్నిటిని ఊహించుకుంటూ కలలుగంటూ, వింత వింతగా ఆలోచిస్తే ఒక్కొక్కప్పుడు పిడుగు పడినట్లుగా తోచేది. కాబూలీవాలాను చూస్తే వాడిదేశంలో ఉన్న ఎడారులు, పెద్దపెద్ద పర్వతాలు, ఎడారులలో పోతున్న ఒంటెలు రకరకాల వస్తువులు తీసుకొని పోవటం నా కళ్ళకు కట్టినట్లు కన్పడేది, మధ్యలో మిని తల్లి 'కాబూలీవాలా జాగ్రత్త' అని చెప్పేది.

మిని తల్లికి పిరికితనము జాస్తి. వీధిలో పెద్ద శబ్దమయినా, జనము గుంపులు గుంపులుగా యిళ్ళకు వెళ్లుతున్నా వాళ్ళందరూ దొంగలు, త్రాగుబోతులు. పాములు, పెద్దపులులుగా భావించేది. ఆమెకు ఇన్ని సంవత్సరా లనుభవమయినా, పిరికితనమూ, భయమూ పోలేదు. కాబూలీవాలా అంటే ఆమెకు భయం. వాడిమీద ఒక కన్నేసి ఉంచండి అని చెప్పేది. ఆమె మాటలకు నవ్వేవాడిని. ఆమె మాత్రం కోపంతో పిల్లను ఎత్తుకు పారిపోతారని, కాబూలుదేశములో వూడిగం చేయిస్తారని, ఈ కాబూలీవాలా మన అమ్మాయిని తీసుకొని వెళ్ళవచ్చుననీ, యింకా ఏమేమో చెప్పేది. ఆమె భయాన్ని పోగొట్టుటకు

'అలా ఎన్నటికీ జరగదు.' అని చెప్పేవాడిని. కాని ఆమె భయం మాత్రం పోలేదు. కాబూలీవాలా ఎప్పుడూ మా యింటికి వస్తూ, మినితో మాట్లాడుతూ వెళ్లతూ ఉండే వాడు. కాబూలీవాలాను రాకుండా నివారించలేము.

కాబూలివాలా పేరు రహిమాన్. సంవత్సరాని కొకసారి జనవరి నెలలో వాని స్వగ్రామమునకు వెళ్లతూ ఉంటాడు. అప్పుడు కాబూలీవాలా ఇంటింటికితిరిగి బాకీలు వసూలు చేసుకొనేవాడు. ఈసంవత్సరం మాత్రం మినిని చూచుటకు ఎప్పుడూ వచ్చేవాడు. ప్రొద్దునవచ్చుటకు వీలు లేకపోతే సాయంత్రమన్నా తప్పక వచ్చేవాడు. చూచే వారికి వీడు మా అమ్మాయి మిని విషయంలో ఏదైనా కుట్రపన్నుతున్నట్లుగా తోస్తుంది. వీడినిచూస్తే నాకుకూడా అప్పుడప్పుడు ఆశ్చర్యం వేస్తుంది. మా అమ్మాయి మినిమాత్రం వాడినిచూడగానే 'ఓకాబూలీవాలా : కాబూలీ వాలా !' అంటూ కేకలు పెట్టుతూ వస్తుంది. వాళ్ళిద్దరూ మంచి స్నేహితులవలె సరదాగా కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటూ కాలం గడిపేవారు.

ఒకరోజు ఉదయం నా గదిలో కూర్చుని కాగితాలు చూచుకుంటున్నాను. ఆ రోజు మంచు కురుస్తున్నది. కిటికీ లోనుంచి సూర్యకిరణాలు నామీద పడుటవలన నాకు హాయిగా ఉంది. ఇంతలోకే వీధిలో. వొక పెద్ద గందర

గోళం జరుగుతున్నట్లు వినపడ్డది. వీధిలోకి చూచేటప్పటికి కాబూలీవాలాను ఇద్దరు పోలీసులు పట్టుకొనివెళ్లుతున్నారు. వారివెంట చిన్నపిల్లలు కేకలువేసుకుంటూ పోతున్నారు. కాబూలీ వాలా గుడ్డలునెత్తురు మరక లయినాయి. ఒక పోలీసు కత్తినిపట్టుకొన్నాడు. సంగతేమిటని నేను వాళ్ళను అడిగాను. కాబూలీవాలాకు వొకరు బాకీ వున్నారని, బాకీ అడిగితే యివ్వలేదని, కాబూలీవాలా అందువలన కొట్టాడనీ చెప్పారు. ఇంతలోకే మాయింటి వరండాలోకి మా అమ్మాయి వచ్చింది. మామూలుగా 'కాబూలీవాలా! కాబూలీవాలా!' అని కేకలు వేసింది. ఈ కేకలు వినే టప్పటికి వాడికి కొద్ది ఆనందం కల్గింది. వాడిదగ్గర మామూలుగా ఉండే సంచిమాత్రము లేదు. 'నీవు మామ గారింటికి వెళ్లుతున్నావా?' అనిప్రశ్నించింది. ఈప్రశ్నకు కాబూలీవాలా నవ్వాడు. 'ఇప్పుడే నే వెళ్ళుతున్నాను' అన్నాడు. ఈ మాటలకు మినిలో మార్పు రాలేదని గ్రహించి తనకు సంకెళ్ళువేసిన రెండు చేతులు చూపిస్తూ 'మామగారిని చావగొట్టేవాడిని, కాని నాచేతులు కట్టేశారు' అన్నాడు.

ఖూనీనేరం క్రింద రహిమాన్‌కు కొన్ని సంవత్స రాలు శిక్షవేశారు. కాలచక్రం తిరుగుతూనే ఉంటుంది.

మేము యాధాతథంగా కాలం గడుపుతున్నాం. కాబూలీవాలా సంగతి మరచిపోయినాం. అమ్మాయి ఎదిగినకొద్దీ తన ఈడువారితో ఆడుకొంటూ కొత్తస్నేహితుల్ని సమకూర్చుకుంది. నాతో కూడా ముచ్చటలు చెప్పటం తగ్గించింది.

కొన్ని సంవత్సరాలు గడిచినాయి. మరల ఆకురాలు కాలం వచ్చింది. మినికి పెండ్లి యీడు వచ్చింది. పెండ్లిప్రయత్నా లన్నీ చేశాము. దుర్గాపూజ పండుగలలో పెండ్లిచేయుటకు నిశ్చయించినాము. పెండ్లికాగానే మమ్మలను వదిలి మా అమ్మాయి మిని అత్తవారింటికి వెళ్ళే రోజు లొచ్చినవి.



వర్షాకాలం వెళ్ళినది. ఈరోజు ఉదయం ప్రకాశవంతంగా ఉంది. సూర్యకిరణాలు బంగారుకాంతులను వెదజల్లుతున్నాయి. కలకత్తాలో ఉన్న మురికి గోడలన్నీ ప్రకాశవంతమైన సూర్యకిరణాలకు మెరుస్తున్నాయి. ఈ రోజు రాత్రి మాఅమ్మాయి మినికి వివాహం చేస్తాం. మేళవాయిద్యాలు మా ఇంటివద్ద ఉదయాన్నుంచే మ్రోగుతున్నాయి. మా అమ్మాయి మమ్మలను వదలిపెట్టి వెళ్ళుతుందని నా హృదయంలో చాలా బాధగాఉంది. మా ఇల్లంతా పచ్చతోరణాలతోను రకరకాల దీపాలతోను

అలంకరించబడ్డది. నేను పెండ్లి ఖర్చుల జాబితా చూచు కుంటూ నా గదిలో కూర్చున్నా. అనుకోనట్లుగా కాబూలీ వాలావచ్చి నాకు నమస్కారము చేశాడు. నేను మొదట వానిని గుర్తుపట్టలేదు. వానిలో చాలామార్పు వచ్చింది.

'రహిమాన్, ఎప్పుడొచ్చావు?' అని అడిగాను. 'నిన్న సాయంత్రము నన్ను జైలునుండి విడుదలచేశారు' అని చెప్పాడు. వాని మాటలు నాకు కర్ణ కఠోరంగా ఉన్నాయి. వాడు రాకుండాఉంటే బాగుండే దనుకున్నాను.

'మా ఇంటిలో ఈరోజు శుభకార్యాలు జరుగు తున్నాయి. నేను హడావిడిగా ఉన్నాను. నీవు మరల యింకోరోజు రాకూడదా' అన్నాను. అతను వెళ్ళుటకు బయలుదేరాడు. తలుపుదాకావెళ్ళి మరల సంకోచించాడు.

'మీ అమ్మాయి మినిని వొక నిమిషం చూడ నిస్తారా' అని అడిగాడు. మిని యిదివరలో మాదిరిగానే ఉంటుందని వాని నమ్మకం. 'ఓ కాబూలీవాలా!' అని కేకలు పెట్టుకుంటూ వస్తుందని వాడు వూహిస్తున్నాడు. ఇదివరలో వలెనే కులాసాగా కబుర్లు చెబుతుందని, నవ్వు కుంటామని వాడు పిచ్చివూహలు వూహించు కుంటున్నాడు.

'మా యింటిలో శుభకార్యం జరుగుతున్నది. ఈ రోజుకు నీకెవ్వరూ కన్పించరు' అని చెప్పాను. వాడు

వెలవెలా పోయాడు. ఆశతో నావంక చూస్తూ 'నమస్తే' అని వెళ్ళాడు. వాడు వెళ్ళిన తరువాత నాకు విచారం కల్గింది. మరల పిలిస్తే బాగుటుం దనుకుంటున్నాను. వాడంతట వాడే తిరిగివస్తున్నాడు. వాడు నాదగ్గరకువచ్చి, 'మిని కోసం, ద్రాక్షపండ్లు, బాదంకాయలు తెచ్చాను. వీటిని ఆ అమ్మాయికి యిస్తారా?' అని అడిగాడు.

నేను వాటిని తీసుకొని, డబ్బు యివ్వబోతుంటే నా చేతిని గట్టిగా పట్టుకుని. 'మీరు దయార్ద్రహృదయులు, నన్ను జ్ఞాపకము పెట్టుకోండి. మీరు వీటికి డబ్బు యివ్వ నవసరంలేదు. మీకు ఒక చిన్న అమ్మాయి ఉంది-నాకు కూడా మా యింటిలో మీ అమ్మాయి మాదిరి వొక చిన్న పిల్ల ఉంది-మా అమ్మాయిని తలుచుకుంటూ, మీ పిల్లకు పండ్లు తెచ్చాను. వాటిని అమ్ముకొని లాభం పొందటానికి రాలే'దని చెప్పాడు. ఈ మాటలు చెబుతూ వాడి జేబులో నుంచి మాసిపోయిన వొక కాగితం తీసి నా బల్లమీద పెట్టాడు. దానిమీద వొక చిన్నపిల్ల చేతి ఆకారం ఉంది. అది ఫొటోకాదు, డ్రాయింగుకాదు, అది కాగితము మీద సిరాతో అద్దకం. వాడు కలకత్తాలో అమ్ముకోటానికి వచ్చే టప్పుడు దీనిని తీసుకొస్తాడు. వాడి అమ్మాయి అంటే అంత ప్రేమ, వాని హృదయంలో ఎప్పుడూ మసులుతూ ఉంటుంది.

నాకు కళ్ళ వెంబడి నీళ్ళు వచ్చినాయి. వాడు పండ్లు అమ్ముకొనే కాబూలీవాలా అని మరచిపోయినాను. వాడు కూడా నావలె వొకబిడ్డ తండ్రి. వాని అమ్మాయి పేరు పార్వతి. ఆ పార్వతి చేతి ఆకారమే కాగితముమీద అద్దుకొని నా బల్లమీద పెట్టాడు. వెంటనే మిని జ్ఞాపకం వచ్చింది. మినికోసం కబురుచేశాను. ఆడవాళ్ళు అనేక అభ్యంతరాలు పెట్టారు. నేను వాటిని లెక్ఖచేయలేదు. మిని మంచి సిల్కు చీర ధరించి, కుంకుమబొట్టు పెట్టుకొని, సిగ్గుపడే పెండ్లికూతురువలె ముస్తాబై నాదగ్గరకు వచ్చి నిలబడ్డది.

మినిని చూచేటప్పటికి కాబూలీవాలాకు ఆశ్చర్యం వేసింది. వాళ్ళ చిన్ననాటి స్నేహాన్ని గుర్తు తేలేక పోయినాడు. చిరునవ్వు నవ్వి. 'అమ్మాయీ, నీవు మామగారింటికి వెళ్ళుతున్నావా?' అని అడిగాడు. మామగారిల్లంటే మినికి యిప్పు డర్థమయినది. ఇదివరలోవలె సమాధానము చెప్ప లేదు. సిగ్గుతో తలవంచుకొని మెదలకుండా నిలబడ్డది.

మిని, కాబూలివాలా మొదటిసారిగా కలుసుకొన్న రోజు గుర్తుకు తెచ్చుకున్నాను. నాకు విచారం వేసింది. మిని వెళ్ళిన తరువాత రహిమాన్ వొక నిట్టూర్పు విడిచి

నేలమీద చతికిల పడ్డాడు. అతని అమ్మాయికూడా పెరిగి పెద్దదయి యిలాగే వుంటుందని వూహించుకున్నాడు.

పెండ్లి వాయిద్యాలు మ్రోగుతున్నవి. వసంత ఋతువులో ప్రకాశించు సూర్యుడు మా మీదికి వస్తున్నాడు. అయితే రహిమాన్ కలకత్తా సందులో కూర్చుని ఆఫ్ఘన్ దేశములోని పర్వతాలను చూస్తున్నాడు.

నేను బ్యాంకునోటు వానికిస్తూ, 'రహిమాన్, ఈ నోటు తీసుకొని మీదేశం వెళ్ళు. మీ అమ్మాయితో సుఖంగా వుండు. మీ యిద్దరి సుఖప్రదమైన కలయిక మా అమ్మాయికి అదృష్టం తెస్తుంది' అన్నాను.

ఈ బహుమతి యిచ్చుటవల్ల నేను పెండ్లిఖర్చులు తగ్గించుకోవలసి వచ్చింది. విద్యుద్దీపాలు, మిలటరీబ్యాండు మేళము మొదలగునవి తగ్గించాను. మావాళ్ళకు యిష్టం లేదు. కాని నాకు మాత్రం తృప్తి, ఆనందం ఉంది. ఎందువల్లనంటే దూరదేశంలో వున్న వొకచిన్న అమ్మాయి చిరకాలపు ఎడబాటు తరువాత మళ్ళీ తండ్రిని కలుసుకుని సుఖంగా ఉంటుందని నా ఆశ.

—: ० :—

# పరిత్యాగం

ఫాల్గుణ మాసంలో వెన్నెలరాత్రి, వసంతరుతువు విలయతాండవ చేస్తున్నది. మధురమైన చల్లటి పిల్లవాయువులు హాయిగా వీస్తున్నవి. 'పాపియా' అనే పక్షి కుహూ కుహూ ధ్వనులతో మధురగానం చేస్తున్నది. హేమంతుడు పడకగదిలో నిద్రపోతున్న భార్యవద్ద కూర్చున్నాడు. ఆమె జుట్టును తన వ్రేలికి చుట్టుకుని, పూలదండ ఆకారముగా తయారుచేసి ఆమె ముఖముమీద వ్రేలాడేటట్లుగా చేశాడు. ఆమెలో ప్రోత్సాహం కల్గించటానికి ఆమెను అటు, యిటూ కదిలించాడు. భర్త ఎంత లాలించినా, ఎన్ని ప్రేమకలాపాలు చేసినా ఆమెలో చలనం కలగలేదు. కొంతసేపటికి కన్నులువిప్పి కిటికీలోనుంచి చూచింది. చంద్రప్రకాశితమైన వెన్నెలరాత్రినిచూచి తన శరీరాన్ని మరచింది.

చివరకు హేమంతు తనభార్య రెండుచేతులు పట్టుకొని చప్పట్లు కొట్టాడు. 'కుసుమా, ఎక్కడ ఉన్నావు? ఈ ప్రపంచాన్ని మరచి ఎచ్చటికైనా వెళ్ళిపోయినావా?

దగ్గరకు రా, ఈ వెన్నెలరాత్రి ఎంతహాయిగా ఉంది!' అన్నాడు. అప్పటికి ఆమెకు మైకం వదలింది. తన భర్తనుచూచి మెల్లగా 'నాకొక మంత్రము తెలుసు. ఆ మంత్రము ఈ వసంతఋతువు వెన్నెల రాత్రిని, చంద్రుణ్ణి ముక్కలు ముక్కలుగా చేయగలదు.'

హేమంతుడు నవ్వుతూ, 'ఆ మంత్రము మన కొద్దు. వారంలో మూడు, నాలుగు శనివారాలు వచ్చేటట్లు నీమంత్రము చేయగల్గిన, మరుసటి రోజువరకు ఈ వెన్నెల రాత్రులలు పెంచేటట్లయితే, మంత్రము జపించు. చాలా హాయిగా ఉంటుంది' ఈ మాటలు చెబుతూ తన భార్యను దగ్గరకు తీసికొనుటకు ప్రయత్నం చేశాడు. ఆ కౌగిలినుండి విడిపించుకొని, 'నేను చనిపోయేటప్పుడు మీకొక రహ్యాము చెబుతానన్నా. ఆ రహస్యము ఈరాత్రి మీకు చెప్పదలచుకున్నా. మీకు జ్ఞాపకమున్నదా? మీరు ఈ రాత్రి నాకెట్టి శిక్షవిధించినా అనుభవించటానికి సిద్ధంగా ఉన్నాను.'

హాస్యము చేయటానికి హేమంతుడు శిక్షలను గురించి వొక పద్యము చదువుటకు సిద్ధంగా ఉన్నాడు. ఈ సమయంలో బయట పెద్ద చెప్పులధ్వని వినిపించింది. రానురాను ఆ ధ్వని ఎక్కువైంది. ఆ చెప్పుల ధ్వని తన

తండ్రి హరిహర ముఖర్జీ దని తెలుసుకున్నాడు. ఏమి చేయుటకు తోచక తత్తరపాటు చెందాడు.

హరిహరముఖర్జీ తలుపుదగ్గరకువచ్చి పెద్ద పెట్టున గర్జించాడు, 'హేమంతా, నీవు వెంటనే నీ భార్యను ఇంటి నుండి వెళ్ళగొట్టు-ఇది నా ఆజ్ఞ.'

హేమంతుడు తన భార్యవంక జూచాడు. భార్య ముఖవైఖరిలో మార్పు కనుపించలేదు. ఆమె తన రెండు చేతులతోను తలను బాదుకుంది. తను అమాంతం మాయమైపోతే బాగుండు ననుకొన్నది. ఈ ప్రపంచం అంతులేని సౌఖ్యాలతో నిండి నిబిడీకృత మైంది — కాని తుదకు ఈ ఆనందా లన్నీకూడా క్షణకాలంలో రూపు రేఖలు లేకుండా పోతాయి. ఆహా ! ఏమి ఈ సృష్టి వైపరీత్యము ?

౨

"అది నిజమేనా ?' అన్నాడు హేమంతుడు.

'నాతో యిప్పటివరకూ ఎందుకు చెప్పలేదు ?'

'నేను మీతో చెప్పుటకు చాలాసార్లు ప్రయత్నం చేశాను. ప్రతీ తడవ చెప్పలేక పోయినాను. నేను దౌర్భాగ్యురాలిని.'

'సరే. ఇప్పుడు సవిస్తరంగా చెప్పు.'

కుసుమ తన కథ పూసగ్రుచ్చినట్లు నిర్భయంగా చెప్పింది. సంపూర్ణంగా కుసుమకథ తెలుసుకొని హేమంతుడు అచ్చటనుండి వెళ్ళిపోయినాడు. ఇదంతా కొత్తగా కనుపించ లేదు కుసుమకు. తనభర్త ఇక ఎన్నటికీ తిరిగి రా డనుకున్నది. ఈ సంఘటనను తన నిత్యజీవితములో జరిగే దానివలె భావించినది. గడచిపోయిన క్షణాలు ఆమె హృదయాన్ని కఠినంగామార్చినాయి. ఈ విశాలప్రపంచం, ప్రేమ, మొదటినుండి చివరవరకు ఏమియు లేని భ్రాంతి వలె తోచినాయి. తాను, గడచిన దినములలో తన భర్త జూపిన ప్రేమ, అనురాగము, ఆమె హృదయంలో బాకు పెట్ట గ్రుచ్చినట్లు బాధపడ్డది.

ప్రేమ, జీవితాన్ని తయారు చేస్తుంది. ప్రేమలో ఉండే మెత్తదనం, అంతులేని ఆనందం, లాలిత్యం కొద్ది ఎడబాటునుగూడా సహింపక చాలా బాధ పెట్టుతాయి. ఈ ప్రేమే నిత్యమైనదని, శాశ్వతమైనదని, దివ్యమైనదని, అంతులేని దని అనుకుంటాము. ఒక క్షణంలో ఆనందం, మరోక్షణంలో దుఃఖం — దీనిని ఊహించటానికికూడా వీలులేదు. కాని ఈ పవిత్రమైన ప్రేమకు సంఘంలో ఉన్న ఆచారాలను అంటగడితే బూడిదలో పోసిన పన్నీరు మాదిరిగా మట్టిగా మారిపోతుంది. క్షణకాలం క్రితమే 'ఎంత అందంగాఉంది ఈ రాత్రి' అని నాచెవులో

చెప్పాడు హేమంతుడు. ఆరాత్రి ఇంకా పూర్తికాలేదు. ఆ చల్లని పిల్లవాయువులు వీచుచునే ఉన్నవి. ఆ చంద్ర కాంతి దేదీప్యమానంగా ప్రకాశిస్తూనే ఉన్నది. మధుర మైన పక్షి పాట పాడుతూనే ఉన్నది. ఇంతలోకే ఎంత మార్పు——ఇదంతా నిజం కాదు - భ్రాంతి - ఆశ. తనకు ప్రేమ అంటే కపటముగను, నిజము కానిదిగను తోస్తున్నది.

ఆ రాత్రల్లా హేమంతుకు నిద్దుర పట్టలేదు. ఉద యమే ప్రియరీశంకరు గోసాలు యింటికి వెళ్ళాడు. 'ఏమిటి సంగతులు, అబ్బాయి' అని శంకరు ఆహ్వా నించాడు. హేమంతుడు తోకత్రొక్కిన త్రాచుపాములాగా లేచాడు బొంగురుగొంతుతో 'నీవు మా కులాన్ని మంట గలిపావు. మాకు నాశనాన్ని తెచ్చిపెట్టావు. దానికి నీవు సమాధానము చెప్పుకోవాలి' అన్నాడు హేమంతుడు. అంతకన్నా ఎక్కువగా మాట్లాడలేక పోయినాడు. ఊపిరి సలుపుకోలేక పోయినాడు.

'నీవు నా కులాన్ని కాపాడావు. నన్ను సంఘం నుండి బహిష్కరించకుండా కాపాడావు నాయనా' అంటూ ఎంతో ఆప్యాయంగా హేమంతుని వెన్ను చరిచాడు శంకరు.

బ్రాహ్మణకోపం శంకరుని భస్మము చేస్తుందను కున్నాడు. శంకరు నవ్వుతూ కూర్చున్నాడు.

'నేను నీ కెప్పుడైనా హానిచేశానా?' అన్నాడు హేమంతుడు దీనంగా.

'నేను నిన్నొక ప్రశ్న వేస్తాను. అది ముందుచెప్పు. నాకూతురు, నాబిడ్డ సీతంద్రికి ఏమి హానిచేసింది ? నీవు కోపం తెచ్చుకోవద్దు—నెమ్మదిగా విను. అప్పుడు నీకు కుతూహలం. నే. చెప్పబోయేదానిలో చాలా హాస్య ముంటుంది.

'నా అల్లుడు, నా కూతురు నగలు అపహరించి ఇంగ్లాడు పారిపోయినాడు. అప్పుడు నీవు చిన్నవాడవు. అయిదు సంవత్సరాలైన తరువాత బారిష్టరు పరీక్షప్యాసై యింటికి తిరిగివచ్చాడు. బహుశః ఈ సంగతి నీకు జ్ఞాపకముండ దనుకుంటాను. అప్పుడు నీవు కలకత్తాలో చిన్నబడిలో చదువుకుంటున్నావు. అప్పుడు సీతంద్రి మన సంఘానికి నాయకత్వము వహించి, 'నేనుగనక నా కూతుర్ని భర్త యింటికి పంపిన యెడల కులమునుండి వెలివేస్తామ'ని బెదరించాడు. నేను ఆయన పాదాలమీద పడి 'రక్షించ'మని ప్రార్థించాను. 'నాఅల్లుడిచేత ఆవుపేడ తినిపిస్తాను. ప్రాయశ్చిత్తం చేయిస్తాన'ని బ్రతిమాలాను.

కాని మీతండ్రి మొండిపట్టు పట్టాడు. నాకు గత్యంతరం లేక నాపిల్లను తీసుకొని స్వగ్రామమందలి బంధువులను, స్నేహితులను వదలి కలకత్తా వెళ్ళాను. అక్కడకూడా నాకు కష్టాలు వెంబట బడినాయి. నేను నా మేనల్లుని వివాహ ప్రయత్నంచేసి, అంతా సిద్ధమయ్యేటప్పటికి నీ తండ్రి ఆ సంబంధంకాస్తా చెడగొట్టాడు. నాకు అంతులేని కోపం వచ్చింది. అప్పుడు నేనొక ప్రతిజ్ఞచేశాను. 'నాలోగనుక బ్రాహ్మణ రక్తం ప్రవహించినట్లయితే, నేనేగనుక బ్రాహ్మణుడనయితే, కక్ష సాధించితీరాలి' ఇప్పటికి నీకు బాగా తెలిసే ఉంటుందనుకుంటాను. కథ సంపూర్ణంగా చెబుతాను. చాలా బాగా ఉంటుంది.

3

'నీవు కాలేజీలో చదువుతున్న రోజుల్లో విప్రదాసు చటర్జీ మీ యింటిపక్కనే ఉండేవాడు. అతడు ఇప్పుడు చనిపోయాడు. అతని ఇంట్లో క్షత్రియకులానికి చెందిన కుసుమ అనే బాలవింతువు ఉండేది. సౌందర్యము తొణికిసలాడుతూ ఉండేది ఆ అమ్మాయి. తరచు ఆ అమ్మాయి డాబామీదకువెళ్ళి సబ్బుతో ముఖము కడుగు కుంటూఉండేది. నీవుకూడా మీ డాబామీద చదువుకుంటూ ఉండేవాడివి. మీరిద్దరూ ఒకరినొకరు చూచుకుంటూ ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ ఉండేవాళ్ళు. మీరిద్దరూ

మాట్లాడుకున్నది, లేనిది నేచెప్పలేను. ఈ సంగతి చటర్జీ గ్రహించాడు. కుసుమ తన గృహకృత్యములలో తప్పు టడుగులు వేస్తూఉండేది. నెమ్మది నెమ్మదిగా ఆహారము, నిద్ర మానుకోటం ప్రారంభించింది. కొన్నిరోజులు చటర్జీ ఎదుట కారణంలేకుండా ఏడుస్తూ వుండేది. నీవుకూడా కాలేజీ ఎగగొట్టి, డాబామీద కూర్చుని, చదువుసంధ్యలు మాని ఆ అమ్మాయికోసం పరితపించేవాడివి. ఈ సంగ తంతా విప్రదాసు చటర్జీ తెలుసుకొని నావద్దకువచ్చి సలహాఅడిగాడు. 'మామా ! నీవు చిరకాలంనుంచి కాశీ వెళ్ళా లనుకుంటున్నావు. అమ్మాయిని నావద్ద దించి నీవు తీర్థయాత్ర చేసుకోమ'ని చెప్పాను.

'ఆప్రకారంగానే చటర్జీ వెళ్ళేడు. నేను ఆ అమ్మా యిని శ్రీపతిగా రింట్లో ఉంచాను. లోకం ఆ అమ్మాయిని శ్రీపతిగారి కూతురు అనుకునేది. తరువాత ఏమి జరి గిందో నీకు తెలుసు. జరిగిన సంగతంతా మొదటినుంచి చివరవరకు నీకు చెప్పుటవలన నాకు నేడు హాయిగాఉంది.'

చివర చెప్పే మాటలు వినకుండానే 'కుసుమ ఈ పెళ్ళికి అడ్డు చెప్పలేదా?' అని అడిగాడు హేమంతు.

'అది ఊహించటం చాలాకష్టం. స్త్రీలమనస్సులు ఎలా నిర్మించబడతయో బహుశా నీకు తెలుసనుకుంటాను.

వారు 'లేదు' అంటే 'ఔను' అని అర్థం వస్తుంది. ఒక రోజున కుసుమను పిలిచి, 'అమ్మా, నే చెప్పేది విను. నేను ముసలివాణ్ణి అయినాను. నీకు నా యెదుట సంపూర్ణ స్వాతంత్ర్య మున్నది. నీ హృదయములో ఏమున్నదో నాకు తెలుసు. నీ ప్రియుని హృదయంకూడా నీలాగేబాధ పడుతున్నది. మీ యిద్దరికి వివాహం చెయ్యా లనుకుంటు న్నాను.' కుసుమ అచ్చటినుంచి పరుగెత్తుకు పోయింది. నీవు బ్రాహ్మణ పిల్లవనే చెపుతాను. ఈ విషయంలో మే మిద్దరము వాదోపవాదాలు చేసుకున్నాము. చివరకు 'నీవు సమ్మతి పడతావేమో అడగ మ'న్నది. 'నీకు తెలియదు. ఆ పిల్లవాడు నీమీద మమకారంతో ఉన్నాడు. నీవు లేక పోతే ప్రాణాలు వదిలేటట్లుగా ఉన్నాడు. ఈ సంగతు లన్నీ అతనికి చెప్పుట సమంజసము కా'దని చెప్పాను. సంగతి సందర్భలు ఈవిధంగా ఉండగా శ్రీపతిని నీ యింటికి పంపించాను. కుసుమను నీవు వివాహము చేసు కొనుటకు అంగీకరించినావు. అంతా నిశ్చయించుకున్నాము. చివరి నిముషములో కుసుమ 'పెండ్లి ప్రయత్నము మాన మ'ని చెప్పినది. చివాట్లు పెట్టాను. 'నే చనిపోయినాను' అని పుకారు పుట్టించమన్నది. ఎచ్చటికైనా పంపి వేయ మన్నది. 'ఈవిధంగా జరిగేటట్లయితే ఆపిల్లవాడి సంగతి ఏం కావాలి ? అతడు పంచప్రాణాలు నీమీద పెట్టు

కున్నాడు. రేపు పెళ్ళిజరగబోతుంటే ఈరోజు నీవు చని పోయినట్లు ఎలా ప్రచారం చేసేది? చివరకు మీ రిద్దరూ కూడా ప్రాణాలు కోల్పోతే మహాపాపమంతా నే ననుభ వించాలి' అని చెప్పి ఆ అమ్మాయిని ఒప్పించాను.

వైభవోపేతంగా మీకిద్దరికీ వివాహం జరిగింది. నా బాధ్యత తీరింది. నా ప్రతిజ్ఞ నెరవేరింది. తరువాత సంగతులు నాకన్నా నీకే బాగా తెలుసు.'

'ఇంతటితో ఎందుకాగలేదు: ఆ రహస్యం యిప్పు డెందుకు బయటపెట్టావు' అన్నాడు హేమంతుడు.

"నీ సోదరికి వివాహ ప్రయత్నములన్నియు పూర్తిఅయినవని తెలియగానే నేను నాలో అనుకున్నాను- 'నేను వొక బ్రాహ్మణకులం పాడుచేశాను. దానిని నావిధి వలన చేయవలసి వచ్చింది. ఇప్పుడు మరియొక బ్రాహ్మణకులం మంటగలసి పోతున్నది. నేను దానిని చక్కదిద్దాలి-' అందువలన నేను నీవు శూద్రజాతి పిల్లను వివాహ మాడావని వారికి తెలియజేశాను" అన్నాడు శంకరు.

హేమంతునికి మితిమీరినకోపం వచ్చింది. మనో నిబ్బరంతో కోపాన్ని దిగమ్రింగి, 'ఈ అమ్మాయిని యిప్పుడు నేను వదలిపెడితే ఆ పిల్లగతి ఏంకావాలి. నీవు కూడా గుడ్డ యిస్తావా?' అని అడిగాడు హేమంతుడు.

'నా కర్తవ్యం ఎంతవరకో అంతవరకు చేశాను. భర్తలు వదిలిపెట్టిన భార్యలను చూచుటకు నాకేమి అవుసరం! అది నాపని కాదు.'

హేమంతబాబుకు కొబ్బరినీళ్ళు, వక్క, ఆకు తెచ్చి యివ్వమని సేవకునికి ఆజ్ఞాపించాడు శంకరు. హేమంతు ఆతిధ్యం స్వీకరించ కుండానే అచ్చటనుండి వెళ్ళి పోయినాడు.

౪

పౌర్ణమివెళ్ళి అయిదు రోజు లయినది. రాత్రి చీకటిగా ఉన్నది. పక్షుల కిలకిలారావములు వినిపించుట లేదు. దక్షిణపుగాలి గ్రుడ్డిగా వీస్తున్నది. ఆకాశాన నక్షత్రాలు మిణుకు మిణుకు మంటున్నాయి. పడక గదిలో దీపం లేదు. హేమంతుడు కిటికీలోగుండా అంధకారాన్ని నిరీక్షిస్తూ కూర్చున్నాడు. కుసుమ క్రింద కూర్చుని భర్త రెండుపాదములు పట్టుకొని ప్రణామము చేస్తున్నది. కాలము మహా సముద్రములాగా కాన్పించుచున్నది. శాశ్వతమైన అర్ధరాత్రివెనుక అదృష్టదేవత ఈ బొమ్మను సృష్టించినదా? అనిపిస్తున్నది. ఇదే సమయంలో మరల చెప్పుల ధ్వని వినిపించింది. హరిహరముఖర్జీ తలుపు దగ్గిరకు వచ్చి 'నీభార్యను వెంటనే వెళ్ళగొట్టు. ఆలస్యము

చేయుటకు వీలులేదు——నీ నిర్ణయానికి యిక అవకాశము లేదు' అని మరల గర్జించాడు.

కుసుమ విన్నది. వెంటనే తనభర్త పాదాలకు నమస్కారం చేసింది. ముద్దు పెట్టుకున్నది. తన భర్త పాదాలను కళ్ళకు అద్దుకున్నది. మరల నమస్కారము చేసి నిలబడ్డది.

హేమంతుడు లేచి తలుపువద్దకు వెళ్ళి 'తండ్రీ! నాభార్యను నేను వదిలిపెట్టను'

'ఏమీటి! కులాన్ని మంట గలుపుతావా?'

'నాకు కులముతో పనిలేదు' అని నెమ్మదిగా సమాధానం చెప్పాడు హేమంతుడు.

'అయితే నిన్నుకూడా వదులుకుంటున్నాను.'

'మంచిది.'

—♦—

## ఆకలి రాళ్లు

నేనూ, నా బంధువూ కలసి కలకత్తాలో జరుగు పూజా వినోదములనుండి తిరిగి ప్రయాణము చేస్తున్నప్పుడు రైల్లో ఒక వ్యక్తిని కలుసుకున్నాం. వాని దుస్తులనుబట్టి, వాని ఆకారాన్నిబట్టి, అతనొక ముసల్మాను అయివుంటాడని అనుకున్నాం. వాని సంభాషణ మాకు విభ్రాంతిని కల్గించింది. అతడు అన్ని విషయాలమీదను సంపూర్ణంగా తెలిసినట్లు మాట్లాడాడు. సృష్టికర్తకూడా వానిని విచారించకుండా ఏపనీ చేయడేమోనని అనిపిస్తుంది. ఇంతవరకూ మేము చాలా సంతోషంగాఉన్నాం. చాటున కుట్రలు పన్నుతున్నారని, రష్యనులు ముందుకు తరుముకు వస్తున్నారని, ఇంగ్లీషువారి పాలసీ రహస్యమైనదనీ సామంతరాజులలో కలవరం బయలుదేరినదనీ మాకు తెలియదు. మనము పత్రికలలో చదివే విషయాలకన్నా అనేకమైన సంగతులు ఈ ప్రపంచంలో జరుగుతూ వుంటాయి. మాకు ఇల్లు తప్ప ఇతరవిషయాలు తెలియనందున, వారి ప్రవర్తన మమ్ములను ఆశ్చర్య

చకితులను చేసింది. ఏ విషయము మాట్లాడినను ఆవ్యక్తి దానిని సమర్ధించుటకు శాస్త్ర ప్రమాణ మును చూపించును. వేదములను విమర్శించును, పర్షియన్‌కవి వ్రాసినపద్యములు చదువును. మాకు శాస్త్రములోను వేదములలోను, విజ్ఞానములేనందున, వాని శాస్త్రజ్ఞానము అద్భుతముగా వుండుటవలన, వానియందు మా కభిలాష హెచ్చెను. నావెంటనున్న బంధువు ఈశ్వర జ్ఞానము కల వాడగుటవలన, మాతో మాట్లాడుతున్న వ్యక్తి ఒక అద్భుతమైన, రహస్యమైన నక్షత్రసంబంధ మైన శక్తి పొందినవాడని గ్రహించెను. ఆ ప్రయాణి కుడు ఏమి మాట్లాడినను ఎంత అర్ధరహితంగా వున్నను నా బంధువు భక్తి శ్రద్ధలతో వాని సంభాషణ వింటూ, చాటుగా చెప్పినది వ్రాసుకొనెను. ఆ విచిత్రమైన వ్యక్తి యిదంతా చూచి సంతోషించినా డని నేను అనుకుంటాను.

రైలు జంక్షనుకుచేరగానే, మేమంతా దిగి, మరొక రైలుకోసం వెయిటింగు రూములో విశ్రాంతి తీసుకొంటు న్నాము. రాత్రి 10 గంటలయింది. రైలు ఆలస్యంగా వస్తుందని తెలిసిన తరువాత, బల్లమీద నాపక్క వేసుకొని నిద్రపోవుటకు ప్రయత్నించాను. మాతో వచ్చిన ఆవ్యక్తి నూలు వడుకుతూ కూర్చున్నాడు. నాకుమాత్రం నిద్దర పట్టలేదు.

పరిపాలనా వ్యవహారములలో అభిప్రాయ భేదములు వచ్చుటవలన, జునాగర్‌లోని ఉద్యోగమునకు రాజీనామాచేసి, హైదరాబాద్ సంస్థానములో ప్రవేశించితిని. బారిచ్‌లో పన్నులు వసూలు చేయుటకు నన్ను నియమించిరి.

బారిచ్ చాలా అందమైన స్థలము. ఆ వూరిలో ఒక నది ప్రవహిస్తున్నది. దాపులో కొండలున్నాయి. నది ఒడ్డున కొండల క్రింద, చలువరాతితో నిర్మింపబడిన ఒక పెద్ద భవనం కలదు. ఊరికి దూరంగా వుంటాన, దానిచుట్టూ ఇళ్ళుగాని, జన సమూహముగాని లేవు.

రెండువందలయాభయి సంవత్సరాల క్రితం, రెండో మహమ్మద్‌షా తన ఆనందం కోసం, సౌఖ్యంకోసం ఆ భవనాన్ని కట్టుకున్నాడు. ఆ రోజుల్లో భవనంలో పన్నీరు చల్లేవారు. పన్నీరు ధారలుగా పడేటట్లు కుండులు కట్టారు. పర్షియన్ యువతులు ఆ చల్లటి చలువరాతి గదులలో కూర్చుని నృత్యగానాలు చేసేవారు. ఆ జలధారలలో, జుట్టు విరియపోసుకుని స్నానము చేసేవారు. వీణె వాయించేవారు. ఎంతో ఆనందంగా ఉండేది.

ఇప్పు డా పాటలులేవు. ఆ ఆనందంలేదు. ఆ తెల్లటి చలువరాతిగదులలో నృత్యంలేదు. బావురుమంటూ

ఇప్పుడా భవనం నాబోటి బ్రహ్మచారులకు ఒంటరిగాళ్ళకు పనిలేనివాళ్ళకు నిలయంగా మారింది. మా ఆఫీసు పాత గుమాస్తా కరీమ్‌ఖాన్, 'మీకు యిష్టమయితే పగలంతా అచ్చట ఉండండి-రాత్రి ఎంతమాత్రం అచ్చటఉండొద్దు' అని తరచు మందలించేవాడు. ఆయనమాట నవ్వులాటగా పరిగణించేవాణ్ణి. నాతో ఉన్న సేవకులంతా ప్రొద్దుగ్రుంకినదాకా పనిచేసి, రాత్రికి వెళ్ళతామని చెప్పారు. అందుకు నేను ఒప్పుకున్నాను. ఆ చలువరాతి భవనం దెయ్యాలకొంపగా పేరుపడ్డది. చీకటిపడితే చివరికి దొంగలుకూడా అచ్చటికి రారు.

మొదట్లో ఆ నిర్మానుష్యమైన భవనం అంటే నాకు భయంగా ఉండేది. పగలంతా కష్టపడి, రాత్రికి అచ్చటికి చేరేవాణ్ణి. అలసి సొలసి ఉంటాన నిద్దుర బాగాపట్టేది.

ఒక వారంరోజులు గడవకముందే ఆచోటు అంటే నాకొకవిధమైన భయం ఆవరించింది. దాన్ని గురించి వర్ణించటంగాని, ప్రజలు నమ్మేటట్లు చెప్పటంగాని సాధ్యపడదు. ఆ భవనంలో అగోచరమైనవాళ్ళు తిరుగుతున్నారని నాకు తట్టింది. బహుశా నేను ఆ యింట్లో కాలు పెట్టినప్పటినుంచి ఇలాగే ఉందనుకుంటాను.

వేసవికాలం వచ్చింది. మార్కెటులో బేరం లేనందున నాకు పనిలేదు. సూర్యు డస్తమించే సమయానికి నేను నదిఒడ్డున ఉన్న మెట్లదగ్గర పడకకుర్చీలో కూర్చున్నాను. నది చాలాభాగం ఎండిపోయింది. నదిలోనున్న యిసుకతిన్నెలు సూర్యకిరణాలకు తళాతళా మెరుస్తున్నాయి. ఆ నదిఏటిలో ఉన్న గులకరాళ్ళు ప్రకాశిస్తున్నాయి. గాలి వీచుటలేదు. అయినను ఆ కొండల దాపునవున్న పొదరిండ్లనుండి కమ్మని సువాసన గాలిద్వారా వస్తున్నది.

సూర్యు డస్తమించాడు. చీకటిపడ్డది. షికారు వెళ్లదామని లేవబోతుంటే మెట్లమీద కాళ్ళచప్పుడు వినపడ్డది. పరికించి చూచాను. ఎవరూ కన్పించలేదు.

ఏదో భ్రాంతిపడ్డానని మరల అచ్చటనే కూర్చున్నాను. చాలామంది మనుష్యుల కాళ్ళధ్వని వినపడ్డది. ఆశ్చర్యం, భయంకూడా వేసింది. నా ముందర ఎవరూ కన్పించకపోయినను, కొంతమంది నాట్యకత్తెలు నదిలో స్నానం చేయటానికి మెట్లు దిగుతున్నట్లు గోచరించింది. కొండలవద్ద, నదివద్ద, భవనంలోను అంతా నిశ్శబ్దంగానే ఉంది. కాని నాకుమాత్రం ఆ నాట్యకత్తెలు నవ్వుతూ, ఆడుతూ, పాడుతూ, ఒయ్యారంగా ఒకరివెంట ఒకరు పరుగెత్తుతూ నన్ను గమనించకుండానే నదిలో స్నానం

చేయటానికి వస్తున్నట్లు బాగా గోచరిస్తున్నది. వారు నాకు కన్పించరు. నేను వారికి కన్పించను. నది ప్రశాంతంగా ప్రవహిస్తున్నది. కాని నాకుమాత్రం ఆ నదిలోని స్ఫటిక జలం చిందుతున్నట్లు, తుంపరలు పడుతున్నట్లు ఒకరిమీద నొకరు నీరు చిందకొడుతూన్నట్లు, చేతులతో పోసుకొని పారబోసినట్లు, నవ్వుతూ కేరింతలుకొడుతూ నీటిలో ఆట లాడుకొన్నట్లు ముత్యాలవలె పడుతూన్నట్లు తోస్తున్నది.

నా హృదయం జలదరిస్తున్నది. అది భయం వలనో, సంతోషంవలనో, ఆతురతవలనో నాకు తెలి యుటలేదు. ఎందువలనో కారణం చెప్పలేను. నేను వారిని చూడాలని కోరిక ఎక్కువైంది. కాని నాకు కన్పించరు. అంతా శూన్యంగా వుంటుంది. నేను జాగ్రత్తగా చెవులు నిక్కబొడుచుకొని వింటే, వారు అనుకొనేదంతా స్పష్టంగా వినగలనని అనుకున్నాను. కాని నేను ఎంత కష్టపడి ప్రయత్నం చేసినా లాభంలేకపోయింది. కిచకిచ ధ్వనులు మాత్రం వినబడుతున్నాయి. నా ముందర వొక తెర ఉన్నట్లు, ఒకమూలనుండి కొద్దిగా తెరఎత్తిచూస్తే, చీకటి మయంగా ఉన్నట్లు తోస్తున్నది.

అమాంతంగా ఒక పెద్దగాలి వీచింది. ఆ గాలికి ఆ నదిలోని ప్రశాంతమైన నీరు గిరగిరా తిరుగుతున్నది.

జలకన్యమాదిరిగా ఉంది. చీకటి ఆవరించిన అడవుల నుండి గొణుగుడు ధ్వని వస్తున్నది. ఇదంతా కలయో, నిజమో, అంతా మాయయైనట్లు గోచరిస్తున్నది. నాకు కన పడని ఆ వింత రహస్యపు ఆకారాలు పెద్దగా నవ్వుతూ ఆటలాడుతూ, అమాంతంగావచ్చి ఆ నదిలో దూకి, వారి దుస్తులను తడుపుతున్నట్లు కాన్పించుచున్నది. గాలిలో సువాసన కలిసిపోయినట్లు, వారంతా నదిలో మాయమై పోయినారు.

నాకు భయంవేసింది. నేను పరధ్యానంగా ఉండ టాన, నా ఒంటరితనం ఒక దయ్యంగా వెంబడించినదనీ నాబోటి సామాన్య మానవుడ్ని నాశనం చేయుటకు ఆవ రించిందనీ అనుకున్నాను. ధైర్యం తెచ్చుకొని భోజనం చేయుటకు నిశ్చయించుకున్నాను. కడుపు ఖాళీగా ఉండి ఆహారం లేకపోతే, నయంగాని పెద్దజబ్బులు వస్తాయి. వెంటనే వంటవాడ్నిపిలిచి, మంచి సువాసనగల, నిండు భోజనం తయారుచేయమన్నాను.

మర్నాడు ఈ ఉదంతమంతా చోద్యంగా కన్పడ్డది. టోపీ పెట్టుకొని ఉద్యోగ విధులను నిర్వర్తించుటకు వెళ్ళాను. ఆ రోజు నేను రిపోర్టువ్రాయవలసి ఉంటాన, ఆలస్యంగా తిరిగివస్తా ననుకున్నాను. కాని అనుకున్నట్టుగా

చీకటిపడక పూర్వమే తిరిగి రావాలని ప్రయత్నం చేశాను. రిపోర్టు పూర్తిచేయకుండానే యింటికి బయలు దేరాను. బాగా చీకటిపడ్డది. దారిలో మనుష్య సంచారము లేదు. అలాగే ఆ కొండవద్దనున్న భవనానికి చేరు కున్నాను.

దీపాలు ఇంకా వెలగలేదు. తలుపుతెరవగానే లోపల గందరగోళం బయలుదేరింది. అనేకమంది చిందర వందరగా త్రోసుకుంటూ, తలుపులుగుండా, కిటికీలు గుండా, తప్పించుకోటానికి ప్రయత్నం చేస్తున్నారు. అంతా మాయమైపోయినారు అనుకున్నాను.

ఇదంతాచూస్తే నాకు ఆశ్చర్యంగా ఉంది, అత్తరూ పన్నీరు వాసనలు గుమాయించి కొడుతున్నాయి. చీకట్లో ఆ స్తంభాలమధ్య నిల్చుని చూస్తుంటే, ఆ పాలరాతిమీద వీణవాయిద్యం చేస్తున్నట్లు, సొమ్ములు గలగలా మన్నట్లు నృత్యం చేస్తున్నట్టు. పాటలు పాడుతున్నట్టు, వింత వింత విశేషాలు జరుగుతున్నట్లు గోచరిస్తున్నది.

స్పృశించుటకు వీలుగాని, వెళ్ళుటకు వీలుగాని, ప్రపంచంలో సంబంధంలేని ఈ మాయ, ఈ మంత్రం ఒక్కటే నిజమని, మిగతాదంతా కలయని–నన్ను ఆవ రించింది. నేను ఫలానావారి పెద్దకొడుకునని, పన్నులు

వసూలుచేస్తూ నెలకు నాలుగువందల రూపాయలు సంపాదిస్తున్నానని, చిన్న 'స్లోలా' టోపీ ధరించి కుక్కలాగుడు బండిలో ప్రతిరోజూ ఆఫీసుకు వెళ్ళుతున్నానని, ఇదంతా హాస్యాస్పదం-కల్పితం-మాయ-బూటకంగా తెలుస్తున్నది. నిశ్శబ్దంగాఉన్న ఆ పెద్ద హాల్లో నిలబడి గుర్రం సకిలింపు వలె పెద్దగా నవ్వాను.

ఆ సమయంలో కిరసనాయిలు దీపం తీసికొని నా నౌకరు వచ్చాడు. నన్నుచూచి ఒక పిచ్చివాడి మాదిరిగా భావించాడేమో నాకు తెలియదు. ఇదివరలో జరిగే సంఘటనలన్నీ స్ఫురణకు వస్తున్నాయి. నా పిచ్చిభ్రమలకు నాలో నేను నవ్వుకున్నాను. కుర్చీలోకూర్చుని దీపం ఎదుట పత్రిక చదువుకుంటున్నాను.

పత్రిక చదవటం పూర్తిఅయిన తరువాత, భోజనంచేసి, పక్కనేవున్న చిన్నగదిలో పడకమీద పడుకున్నాను. కిటికీగుండా కొండలమీద ఎంతోదూరానఉన్న ప్రకాశవంతమైన నక్షత్రం చీకటిని చీల్చుకొంటూ, నామీద కాంతి వెదజల్లుతున్నది. అలా ఆలోచించుకొంటూ నిద్రపోయాను. ఎంతసేపు నిద్రపోయానో నాకుతెలియదు. తటాలున మెళకువ వచ్చింది. అంతా నిశ్శబ్దంగాఉంది. ఎవరూ కాన్పించలేదు. అప్పుడే కొత్తగావచ్చిన చంద్రుని కాంతి నా గదిలోకి వస్తున్నది.

నా కెవ్వరూ కాన్పించలేదు. కాని నన్నెవ్వరో నెట్టు తున్నట్లు తోచింది. కళ్ళు బాగా తెరచిచూచాను. ఆమె అయిదు వ్రేళ్ళకు ఉంగరాలు పెట్టుకుని, మాటామంతీ లేకుండా జాగ్రత్తగా వెంటరావలసినదిగా ఆజ్ఞాపిస్తున్నది. చప్పుడు కాకుండా లేచాను. ఆ నిర్మానుష్యమైన భవనంలో నేనుతప్ప అన్యులెవ్వరూలేరు. ఆ భవనంలో అనేకమైన గదులున్నాయి. ఆడు గడుగుకూ భయంగా ఉంది. ఆ గదులన్నీ మూసిఉంటాయి. ఎప్పుడూ వాటిల్లోకి వెళ్ళ లేదు.

అగోచరంగాఉన్న ఆమె వెంట నిశ్శబ్దంగా బయలు దేరాను. ఎక్కడికో నాకే తెలియదు. అంతులేని, యిరు కైన చీకటి త్రోవలగుండా, పెద్ద పెద్ద వసారాలగుండా, అనేకమైన రహస్యపు గదులను దాటాను.

నాకు త్రోవజూపే వ్యక్తి కాన్పించకపోయినను, ఆమె ఆకారం మాత్రం నా కళ్ళకు కన్పిస్తున్నది. ఆమె అరబ్బుదేశపు అమ్మాయి. ఆమెచేతులు పాలరాతివలె నునుపుగా, మెత్తగా నిగనిగలాడుతూ వుంటాయి. సన్నని గుడ్డ మొహాన వ్రేలాడుతున్నది. నెత్తిన టోపీ పెట్టు కొన్నది. బొడ్లో వంకరతిరిగిన బాకును పెట్టుకొన్నది. అరేబియన్ నైట్సు కథలు గుర్తుకు వస్తున్నాయి.

చివరకు ఆమె ఒక నీలవర్ణపు స్క్రీను దగ్గర ఆగి క్రిందకు చూపిస్తున్నది. తీరాచూస్తే అచ్చట ఒక పెద్ద భయంకరమైన నీగ్రో ఆవలింతలుపెట్టుతూ, కాళ్లు చేతులూ చాచుకొని కత్తిని పట్టుకొని కూర్చున్నాడు. ఆమె నీగ్రో కాళ్ళనుదాటి స్క్రీనును కొద్దిగా ఎత్తినది. అచ్చట ఉన్న గదిలోని కొంతభాగము కాన్పించినది. దానిలో పర్షియన్ తివాచీ పరచిఉన్నది. ఆ తివాచీమీద పరుపు పరచిఉన్నది. దానిమీద ఎవరో కూర్చున్నారు-ఆమె సరిగా నాకు కాన్పించుటలేదు. బంగారు స్లిప్పర్లు ధరించిన ఆమె పాదాలు గోచరిస్తున్నాయి. ఒకప్రక్కన పళ్ళెంలో నారింజ కాయలు, ద్రాక్షపళ్ళ గుత్తులు, యాపుల్సు రెండు చిన్న కప్పులు-సాసర్లు ఉన్నాయి. ధూపము లేస్తూన్నది. దాని నుంచివచ్చు ఆవిరి మత్తును కల్గించుచున్నది.

భయంతో వణుకుతూ ఆ నీగ్రో కాళ్ళను దాటుటకు ప్రయత్నంచేశాను. పెద్దగా ఆవలిస్తూ నీగ్రోలేచాడు. కత్తి క్రిందపడి పెద్దధ్వని వచ్చింది. గభాలునదూకాను. చెమటతో తడుస్తూ ఆ పక్కమీద తడబడుతూ కూర్చున్నాను. ఈవిధంగా అరేబియన్నైట్సు కథలలో ఒకటి పూర్తి అయింది. ఇంకా వెయ్యి కథలున్నాయి.

రోజులు, రాత్రులూ సరిపడకుండా గడిచి పోతున్నాయి. పగలల్లా కష్టపడి అలసి సొలసి రాత్రి వచ్చే

టప్పటికల్లా తిట్టుకుంటూ కలలు కనేవాణ్ణి. రాత్రిపూట-నే చేసే పగటి పనంతా అపహాస్యంగాను, వ్యర్థంగాను నవ్వుగాను, మాయగాను, తోచింది. చీకటిపడగానే మాయ ఒకటి నన్ను ఆవరించేది. నే నొక విచిత్రమైన వ్యక్తిగా మారిపోయేవాణ్ణి. నే ధరించిన దుస్తులన్నీ సరిపడేవికావు. అందుకని ఎఱ్ఱటి టోపీ పెట్టుకుని, పైజామాలు ధరించి, సిల్కు గౌను తొడుక్కుని, అత్తరు రాసిన రంగు రంగుల జేబురుమాలా పట్టుకుని, మెత్తటి పాన్పువలె నుండు కుర్చీలో కూర్చుని, ప్రియుడు ప్రేయసీకోసం ఎదురు చూస్తూన్నట్లు ఉండేవాణ్ణి.

చీకటి పడుతున్నకొద్దీ జరిగే విచిత్ర సంఘటన గూర్చి వర్ణించటం నా శక్యంకాదు. వాటికి మొదలూ చివరా లేదు. రాత్రల్లా వాటిని తెలుసుకొనుటకు ఆగదు లన్నీ కలియ తిరిగేవాణ్ణి. ఇదంతా సత్యమో అసత్యమో నాకే తెలియదు. వీణ వాయిద్యాలు, సంగీత వాయిద్యాలు, నృత్యాలు, ఆటలు, పాటలు, కేరింతల వాతావరణంలో నేనొక క్షణంపాటు చక్కటి నాట్యకత్తెను చూచేవాణ్ణి. ఆమె రంగురంగుల పైజామాలు ధరించును. పాదాలకు బంగారపు స్లిప్పర్లు తొడుగును. ఎర్రటి టోపీ ధరించును తెల్లటి మంచు గడ్డవలె శరీరచ్ఛాయ వుండును.

ఆమెను చూస్తే నాకు పిచ్చెత్తేది. ఆమెకోసం రాత్రిళ్ళు గదులన్నీ వెతికేవాణ్ణి. త్రోవలన్నీ చూచేవాణ్ణి. ఈ మాయలో పడి కొట్టుకునేవాణ్ణి.

ఒక్కొక్కప్పుడు పెద్ద అద్దంముందర నుంచుని ఒక రాజకుమారునిగా భావించుకుని ఆలోచించేవాణ్ణి. అప్పుడు నా ప్రక్కన పర్షియన్ కన్యల అందం నృత్యం చేస్తున్న దనుకుంటాను. తటాలున మెడలు అటూ ఇటూ తిప్పే పర్షియన్ యువతి- ఆమె లోతైన నల్లని కళ్ళ నుండి వెలువడే అంతులేని ప్రేమ, ఆమె ఎర్రని పెద వులనుంచి తొణికిసలాడే మాటలు, ఆమె మిసమిసలాడే ఆకారం, వికసించిన పూలతీగలవలె ఉంటూ, నా హృద యాన్ని కలతపెట్టేది. ఆమె నవ్వులు, ఆమె దుస్తులు వర్ణించుటకు వీలులేని సౌందర్యం, ఆమె చూపులు, కొండలమీదనుండివీచు చల్లటి పిల్లవాయువులు, ఆ గాలికి దీపం ఆరిపోవటం, కళ్ళు మూతలుపడటం, శరీరం పులక రించటం, ఆమె నన్ను తన మృదువైన హస్తాలతో స్పృశించటం, ఆ తాకులు, అత్తరు పన్నీరులతో నిండిన జేబురుమాలుతో విసరడం, నా బుగ్గలను ఆమె ముని వ్రేళ్ళతో కొట్టడం వివిధ విధాల ఆలోచించుకుంటూ పడు కునేవాణ్ణి. పాములవలె చుట్టలు చుట్టుకొని నామీద వాలటం యింతలోకే నేనొక నిట్టూర్పు విడవటం సంభవించేది.

ఒకరోజు సాయంత్రం గుఱ్ఱంమీద స్వారీచేయు టకు నిశ్చయించుకున్నాను. ఆ రోజు ఎవరు చెప్పినా వినదలచుకోలేను. నా ఇంగ్లీషుకోటు, టోపీ, మేజామీద ఉన్నాయి. వాటిని తీసికొనుటకు ప్రయత్నం చేసేటప్ప టికి, అమాంతంగా ఒక పెద్ద సుడిగాలి వచ్చి, వాటినిండా నదిలోని యిసుక, దుమ్ము, కొండలమీదనుండి ఎండి పోయిన ఆకులు పడినాయి. పకపకమని పెద్దగా నవ్వుతూ నవ్వు మాయమైపోయింది.

ఆరోజున స్వారికి వెళ్ళలేను. అర్ధరాత్రి హృద యాన్ని చీల్చే పెద్దపెట్టున ఏడ్పులు, నా ప్రక్కక్రింద, భూమిమీద, ఆ పెద్ద విశాలమైన అంతులేని భవనంలోను వినపడుతున్నాయి. 'నన్ను రక్షించండి! ఈ మాయల నుండి, కలలనుండి, బయటకు రండి- నిద్రలేనండి - మీ హృదయానికి హత్తుకొనండి, మీప్రక్కన కూర్చోపెట్టు కుని, కొండలమీదుగా అడవులగుండా, నదిప్రక్కగా స్వారీచేయండి' అంటున్నాయి.

నే నెవ్వరిని? ఎలారక్షిస్తాను? ఓ! ఏమి అందం? ఏమి ప్రేమ? ఎట్లా ఈ మాయలనుండి బయటకు చేర్చేది? ఎక్కడ వుంటున్నావు! ఏమిటి విచిత్రం? ఈ చరిత్ర ఏమిటి! ఆ సంగీతం - ఆ వీణా వాయిద్యాలు - కత్తుల

తళతళ - మెరుపులు - అబ్బా ఏమి అందం - ఏమి వైపరీత్యం - అంతా విచిత్రంగా ఉంది.

అమాంతంగా మెహరాలి 'అవతలికి - అవతలికి. యిదంతా మాయ - నిజంగాదు. అసత్యం- నమ్మవద్దు' అని అరిచాడు. కళ్ళుతెరిచాను. వెలుతురు వచ్చింది. నౌకరువచ్చి ఉత్తరాలిచ్చాడు. వంటవాడు నిలబడ్డాడు.

'నే నిచ్చట ఉండలేను' అని చెప్పాను. సామానులు సర్దుకుని ఆఫీసుకు మకాం మార్చాను. కరీమ్‌ఖాన్ నన్నుచూచి నవ్వాడు. నేను పట్టించుకోకుండా నాపని నేను చూచుకుంటున్నాను.

సాయంత్రం కావస్తున్నది. నాలో జ్ఞాపకశక్తి తగ్గిపోవుచున్నది. లెక్కలు తనిఖీచేయుట, పని సక్రమంగా నేరవేర్చుట, — అన్నీ అయోమయంగా వున్నాయి. ఇవన్నీ ఎందుకూ పనికిమాలిన వాటిగా భావించాను — వాటినిచూస్తే ఏవగింపు, ఏహ్యాభావం కలుగుతున్నది.

కలం క్రిందపెట్టాను. పుస్తకాలు మూసివేశాను. బండిఎక్కి బయలుదేరాను. ఆ భవనానికి చేరేటప్పటికి, కొద్దిగా వెలుతురుఉంది. మెట్లుఎక్కి గదిలో ప్రవేశించాను.

అంతా నిశ్శబ్దంగా ఉంది. ఆ చీకటి గదులన్నీ కళ, కాంతులు లేకుండావున్నాయి. నామీద పగ సాధించా

లన్నట్టుగావున్నాయి. నా హృదయం చాలా బాధపడ్డది. పశ్చాత్తాపముతో నిండినది. క్షమాపణ చెప్పుటకు అచ్చట ఎవరూలేరు. ఆలోచన లేకుండా చీకటి గదులన్నీ కలియ తిరిగాను. వీణ ఉంటే పాటలు పాడుదా మనుకున్నాను. 'భయపడి పారిపోయి తిరిగి వచ్చాను, నా తప్పు క్షమిం చండి - ఈ పేదవాడ్ని కనికరించండి. మీలో కలుపు కోండి' అన్నాను.

తటాలున రెండు కన్నీటి బొట్లు నా కనుబొమల మీద పడినాయి. కొండలమీదికి నల్లని మేఘాలు గుంపులు గుంపులుగా వచ్చినాయి. కొండలదాపున ఉన్న అడవులు, నదిలోని నీరు ప్రశాంతంగా వున్నాయి. హఠాత్తుగా పిచ్చి వాడు గొలుసులను త్రెంపుకుని పిచ్చిగా అరచినట్లు, ఉరు ములు మెరుపులతో పెద్దగాలి తుపాను వచ్చింది. దానికి భూమి, అకాశము, నీరు గజగజ లాడుతున్నాయి. ఆ భవనంలో ఉన్న తలుపులన్నీ కొట్టుకుని పెద్ద ధ్వని చేసి నవి.

నౌకర్లంతా ఆఫీసులో ఉంటాన, దీపాలు వెలిగించ లేదు. ఆకాశం మేఘాలతో నిండిపోయింది. చంద్రుడు ఉదయించలేదు. అట్టి వాతావరణంలో ఒక స్త్రీ తివాసి మీద పడుకుని వ్రేళ్ళతో జుట్టును సవరించుకుంటూ

ఉన్నట్లు నాకు బాగా గోచరిస్తున్నది. ఆమె అందమైన కనుబొమల నుండీ నెత్తురు వస్తున్నది. ఆమె పిచ్చిగా అదోక రకమైన నవ్వు నవ్వుతూ, మధ్యమధ్య విలపిస్తున్నది. పెద్దగా వర్షం కురుస్తున్నది. వర్షం కిటికీలోగుండా పడి ఆమె తడిసిపోవుచున్నది. రాత్రల్లా వర్షం కురుస్తూనే ఉన్నది. బరువెక్కిన హృదయంతో ఆ చీకట్లో గదులన్నీ తిరిగాను. ఓదార్చటానికి అచ్చటెవ్వరూ నాకు కాన్పించలేదు. ఈ భరింపలేని విచారము ఎక్కడిది? ఎచ్చట నుండి వస్తున్నది?

ఆ పిచ్చి మెహరాలి, 'అవతలకు! అతలకు! ఇదంతా అసత్యం - మాయ' అని అరిచాడు.

తెల్లవారినది. మెహరాలీ అరుస్తూ ఆభవనంచుట్టూ తుపానులో తిరుగుతున్నాడు. బహుశః అతడు ఒకప్పుడు పిచ్చివాడైనప్పటికి మామూలుగా ప్రతిరోజూ వచ్చి, ఆ యువతి మాయలో పడి తిరుగుతూ వుంటాడని నాకు జ్ఞాపకం వచ్చింది.

పెద్ద గాలివాన వీస్తున్నప్పటికి నేను వానివద్దకు పరుగెత్తి, 'హో మెహరాలి, ఆ బూటకం ఏమిటి?' అని అడిగాను.

నాకు జవాబు చెప్పకుండా అవతలకునెట్టి మామూలుగా వాని ధోరణిలో, 'అవతలికి! అవతలికి! యిదంతా వట్టి బూటకం! కల్ల! మాయ!' అని అరుస్తూ తిరుగుతున్నాడు.

పిచ్చివాని మాదిరి వర్షంలో ఆఫీసుకు పరుగెత్తి కెళ్ళి, కరీమ్‌ఖాన్‌ను ఈ మాటలకు అర్థం చెప్పమని అడిగాను. ఆ ముసలాడు చెప్పిన మాటలలోని భావము యిది.

'ఒకప్పుడు ఆ భవనం, తీరనికోరికలతోను, ప్రతిఫలంలేని ప్రేమకలాపాలతోను, అంతులేని సౌఖ్యాలతోను తులతూగుతూ వుండేదని, అనేకమంది పర్షియను సౌందర్య యువతులు నృత్యం, సంగీతము పాడేవారనీ యిప్పుడా భవనమంతా పాడుపడిపోయి, ఆ యువతుల వాంఛలు తీరనందున, ఆ భవనంలోని ప్రతి అణువూ, రాయి ఆకలి దప్పులతో అలమటించిపోతున్నవనీ, ఎవరైనా ఘోరఘాటున అచ్చటకువస్తే, బ్రహ్మరాక్షసివలె వీరంతా పైనపడతారట. మూడు రాత్రులు ఆ భవనంలో గడిపే టట్లయితే, ఈ బాధలకు లోను కావల్సిందే. ఈ మాయలో పడిపోవాల్సిందే.'

'అయితే వీటినుండి తప్పించుకునే మార్గంలేదా?' అని అడిగాను.

'ఒకటే మార్గం ఉంది. అది చాలా కష్టం-అదేదో మీకుచెప్పేముందర, పర్షియను యువతియొక్క హృదయ విదారకరమైన గాధను తెలుసుకోవాలి-ఆమె అచ్చట నివ శించింది' అన్నాడు ముసలాడు.

ఆ సమయంలో కూలీలు రైలు వస్తున్న దని చెప్పారు. వెంటనే సామాను సర్దుకున్నాను. ఒక ఇంగ్లీషు దొర ఫస్టుక్లాసు పెట్టెలోనుండి స్టేషన్ పేరు చదువుటకు తొంగిచూస్తున్నాడు. అతను మా ప్రక్క ప్రయాణీకుని చూచి, 'హల్లో' అంటూ వాని కంపార్టుమెంటులోనికి తీసుకువెళ్ళాడు. మేము రెండవ తరగతి పెట్టెలో కూర్చున్నాం. ఆ వ్యక్తి ఎవరో, వానికథ ఏమిటో మాకు తెలుసుకోడానికి అవకాశం లేకపోయింది.

'కథంతా మొదటినుంచీ చివరదాక కేవలం కల్పితం-మనల్ని తెలివితక్కువ వాళ్ళతో జమకట్టాడు' అన్నాను. తరువాత జరిగిన సంభాషణ నాకూ నా బంధు వులకూ జీవితాంతం వరకూ ఎడబాటు కల్గించినది.

•